# ఓం శ్రీ మహాగణాధిపతయేనమః

శ్రీ మహాగణపతి జ్యోతిషాలయం, సాయి నగర్, నాగోల్, హైదరాబాద్



09849983322

# లగ్నాధిపతి వివిధ ఇళ్ళలో

## 1 నుండి 12 వ ఇంటి వరకు

Dr. Nageswara Rao Jayanthi
09849983322

# జాతక పరిసీలనకు గుర్తుంచుకోవలసిన విషయములు

- మనము చర్చించే అన్ని అధ్యాయములలో 1 వ ఇంటి నుండి 12 వ ఇంటి వరకు ఏ అధ్యాయము అయినప్పటికి ఆ ఇల్లు ఆ అధ్యాయమునకు మొదటి ఇల్లు అవుతుంది దాని వెనుకటి ఇల్లు 12 వ ఇల్లు అవుతుంది.
- జాతకునికి రావలసిన ఫలితములు నిర్ధారించేది గ్రహముల స్థితి గతులే నిర్ధారించనని గుర్ర్తుంచుకోవలెను.
- అన్ని గ్రహములు సమముగా మంచివి చెడువికూడా .
- గ్రహము వున్నది సొంత యింట్లోనా లేక అద్దె యింటిలోనా పరిశీలించాలి. అద్దె యింటి లో అయితే స్నేహితుని, శత్రు, సముని ఇల్లా పరిశీలించాలి. గ్రహములు పై స్థితిని అనుసరించి ఫలితాలు ఇస్తారు.
- గ్రహము వున్న ఇల్లు ఆ గ్రహానికి శుభ స్థితి అయితే శుభ ఫలితాలను లేదా అశుభ ఫలితాలను యిస్తాయి.
- ఒకే రాసిలో ఎక్కువ గ్రహములున్నచో అవి ఆయింటి ద్వారా యివ్వవలసిన ఫలితాలను తారుమారు చేస్తాయి అని నానుడి.

ఇప్పుడు మనము లగ్నము వున్నాము. ఈ అధ్యాయమునకు లగ్నము 1 వ ఇల్లు అవుతుంది, 12 వ ఇల్లు 12 వ ఇల్లు అవుతుంది.

- లగ్నము - 1 వ ఇల్లు
- 2 వ ఇల్లు - 2 వ ఇల్లు
- 3 వ ఇల్లు - 3 వ ఇల్లు
- 4 వ ఇల్లు - 4 వ ఇల్లు
- 5 వ ఇల్లు - 5 వ ఇల్లు
- 6 వ ఇల్లు - 6 వ ఇల్లు
- 7 వ ఇల్లు - 7 వ ఇల్లు
- 8 వ ఇల్లు - 8 వ ఇల్లు
- 9 వ ఇల్లు - 9 వ ఇల్లు
- 10 వ ఇల్లు - 10 వ ఇల్లు
- 11 వ ఇల్లు– 11 వ ఇల్లు
- 12 వ (లగ్నం ఉంటుంది) - ఈ సెషన్ కోసం 12 వ ఇల్లు అవుతుంది

# చతుర్ధ స్ధానము - కారకత్వములు

- తల్లి
- ప్రాధమిక విద్య
- విద్య ద్వారా అభివృద్ధినందిన బుద్ధి బలము
- పిత్రార్జితముగా సంక్రమించిన సంపద
- భూ సంపద
- గృహ సంపద
- లంకె బిందెలు
- గృహస్థ జీవితము
- వంశ పారంపర్యముగా సంక్రమించిన ప్రవృత్తులు
- జీవితములో ఉత్తరార్ధము
- మనః శాంతి
- వాహన సౌఖ్యము
- తోటలు
- ఆరామములు
- గనులు

# 4 వ ఇంటి అధిపతి 1 వ ఇంట్లో

- మొదటి ఇంటిలో ఉన్న అధిపతి వలన జాతకుడు ఆరోగ్యంగా ఉంటారు. వీరు సుదీర్ఘకాలం జీవిస్తారు.
- జాతకుడు మానసికంగా మరియు శారీరకంగా బలంగా ఉంటాడు. అతను/ఆమె జీవితంలో సంతోషాన్ని మరియు విజయాన్ని పొందుతారు. అతను/ఆమె తెలివైన వ్యక్తి కాబట్టి ప్రతీ అడుగు వేసే ముందు అతను/ఆమె ఎల్లప్పుడూ క్షుణ్ణంగా ఆలోచిస్తారు.
- **ఆ ఇంటిలో ఉన్న గ్రహం/గ్రహములు మంచిగా ఉంటే సానుకూల ఫలితాలను ఇస్తుంది. కాకపోతే ఫలితాలు ప్రతికూలంగా ఉంటాయి.**
- **మీకు తెలిసినట్లుగా, ఒక ఇంటిని ఆక్రమించిన మరిన్ని గ్రహాలు ఇంటిని పాడుచేయవచ్చు లేదా పై పరిస్థితులను బట్టి ఫలితాలను ఇస్తాయి.**

# 4 వ ఇంటి అధిపతి 2 వ ఇంట్లో

- రెండవ ఇంట్లో లగ్నాధిపతి స్థానాన్ని విశ్లేషిద్దాం.
- ఈ జాతకులు యొక్క రెండవ ఇంట్లో లగ్నాధిపతి ఉండటం వలన, అతను/ఆమె వారి స్వంత ప్రయత్నాల ద్వారా డబ్బు సంపాదిస్తారు.
- లగ్నాధిపతి నిర్ణయింపబడిన లేదా కష్టపడి పనిచేసే వ్యక్తి తెలివైన వ్యక్తి. ఈ ఫలితాలు ఎల్లప్పుడూ పొందుతూ సంతోషంగా వుంటారు.
- కుటుంబంలో మరియు సమాజంలో గౌరవించబడతారు.
- రెండవ ఇంట్లో లగ్నాధిపతి ఉండటం కుటుంబం పట్ల ప్రేమను వర్ణిస్తుంది కనుక, ఈ జాతకులు ఎల్లప్పుడూ స్నేహితులు మరియు కుటుంబ సభ్యులను ప్రేమిస్తారు మరియు కష్ట సమయాల్లో ఎల్లప్పుడూ వారి పక్కన ఉంటారు.
- ఈ జాతకులు సొంత వ్యాపారంలో విజయం సాధిస్తారు, అలాగే ఈ జాతకులు దూరదృష్టి గలవారు గనుక ఎల్లప్పుడూ దీర్ఘకాలిక లాభాలను పరిగణనలోకి తీసుకుంటారు.

# 4 వ ఇంటి అధిపతి 3 వ ఇంట్లో

- 1 వ ఇంటి అధిపతి 12 వ ఇంటిలో వున్నట్లవుతుంది. 4 వ ఇంటికి 3 వ ఇల్లు 12 కాబట్టి. ఈ స్థితి వల్ల ఈ జాతకునికి ఆరోగ్య సమస్యలకు కారణమవుతుందని చెప్పవచ్చు లేదా తల్లి నుండి దూరమవుతారు.. గ్రహస్థితిని అనుకూలముగా లేనిచో విద్యలో అవరోధములు, ఆటంకములు జరిగే అవకాశముండును.
- 3 వ ఇల్లు చిన్న చిన్న ప్రయాణాలను సూచిస్తుంది. 4 వ ఇల్లు ఇంటిని, కుటుంబమును కూడా సూచిస్తుంది కనుక వీరు చదువు, వృత్తి లేదా ఏదేని కారణముల వలన ఇంటినుండి దూరముగా నివసిస్తారు.
- 4 వ ఇల్లు మానసిక స్థిమితమునకు సంబంధించినది, ఈ అధిపతి 3 వ ఇల్లు అంటే 12 వ ఇంట్లో వున్నట్లు అవుతుంది, కనుక ఈ జాతకునికి మానసిక విశ్రాంతి గాని లేదా మానసిక స్థిమితము లేకపోవుట గాని జరుగవచ్చు.
- 4 వ ఇంటికి సంబంధించిన విషయములలో ఈ జాతకుని సంతృప్తి లేదా శక్తి అతి కష్టము మీద గాని లభించవు.
- 4 వ ఇల్లు 3 వ ఇంటికి 2వ ఇల్లు, 3వ ఇల్లు కమ్యూనికేషన్స్, 2 వ ఇల్లు వాక్కు కాబట్టి వీరికి మంచి వాక్చాతుర్యము తో జనాకర్షణ శక్తి కలిగి వుందురు.

# 4 వ ఇంటి అధిపతి 4 వ ఇంట్లో

- 4 వ ఇంటి అధిపతి 4 వ ఇంటిలో ఉన్నాడంటే, ఈ అధ్యాయానికి ఈ ఇల్లు 1 వ ఇల్లుగా పరిగణిస్తాము కాబట్టి 1 వ ఇంటి అధిపతి 1 వ ఇంటిలో ఉన్నట్లుగా భావిస్తాము. కనుక ఈ స్థితి ఈ ఇంటికి అధిక బలాన్నిస్తుంది.

- ఈ ఇంటిని జతకములో కేంద్ర స్థానములయిన 1,4,7,10 ని 4 స్తంభాలుగా అనుకుంటే ఇది ఒక బలమయిన స్తంభాముగా చెప్పవచ్చును. ఈ గ్రహ స్థితి వలన ఈ జాతకులు విద్య, ధనధాన్యములు, , వాహనములు, భూ గృహ సేవా జన తదితర అన్నిరకముల సుఖ సౌఖ్యములను పొందుదురు.

- 4 వ తల్లి కనుక వీరు మాతృమూర్తిపై అతి ప్రేమానురాగములు కలిగి వుందురు.

- ఈ జాతకులు సహృదయులు, మతముపట్ల అతి గౌరవము భక్తి ప్రపత్తులు కలిగి మంచి గుణము కలిగి వుంటారు.

# 4 వ ఇంటి అధిపతి 5 వ ఇంట్లో

- 1 వ ఇంటి అధిపతి 2 వ ఇంటిలో వున్నప్పుడు గ్రహములు బలముగా ఉన్నచో దీనిని శుభ సూచకముగా తెలుసుకోవలెను.
- 4 వ ఇల్లు మనస్సు, 5 వ ఇల్లు బుద్ధి కనుక వీరు సహజముగానే అధిక బుద్ధి బలము కలవారు.
- 4 వ ఇల్లు తల్లి, 2 వ (4 వ ఇంటికి 5 వ ఇల్లు 2 వ ఇల్లు) ఇల్లు సంపద కనుక ఈ జాతకుల తల్లి ఆర్ధిక స్థోమత కలిగి వుంటారు కనుక , వీరికి తల్లి తరపు నుండి ఆస్థి వచ్చునని చెప్పుటకు ఎటువంటి సందేహము లేదు.
- ఈ గ్రహ స్థితిని బట్టి ఈ జాతకులు మంచి విద్యావంతులై వుంటారు. తద్వారా వీరు జీవితములో మంచి అభివృద్ధిని సాధిస్తారు.
- వీరికి 5 వ ఇంటి ద్వారా చెందే పూర్వ జన్మ సుక్రుతముచే కొద్దిపాటి కృషితో వీరు విజయములను సాధిస్తారు.
- ఈ జాతకులు దృఢమైన మత భావములు మరియు ఆధ్యాత్మిక భావములు కలిగిన వ్యక్తిగా అభివర్ణించవచ్చు.

# 4 వ ఇంటి అధిపతి 6 వ ఇంట్లో

- 6 వ ఇల్లు దుస్థానము. 4 వ ఇంటికి అధిపతి 6 వ ఇంటిలో ఉన్నందున ఈ భావ కారకములైన సుఖ, సంతోషము లేక, మానసిక స్థిమితము కోల్పోయి, శత్రుత్వము అధికమయ్యి ఇబ్బందులు పడుదురు. గ్రహస్థితి బాగున్నచో భిన్న ఫలితములు పొందుదురు.
- ఈ గ్రహస్థితిని బట్టి వారి తల్లి గారు ఆరోగ్య సమస్యలు ఎదుర్కొనే అవకాశములు మెండుగా ఉండును. ఈ భావములపై శుభ గ్రహ దృష్టి వున్నచో వీరికి ఉపశమనము కలుగుణని చెప్పవచ్చును.
- ఈ జాతకుల ఆస్థి విషయములలో న్యాయపరమైన చిక్కులు వచ్చే అవకాశముండును. అలాగే వీరు వాహనములు నడుపునప్పుడు తగు జాగ్రత్తలు తీసుకొనవలెనని సూచించవలెను.
- వీరు విద్యాభ్యాసములో చిక్కులను ఎదుర్కొందురు.
- ఈ జతకులకు విద్యాభ్యాసము న్యాయ మరియు వైద్య సంబంధిత చదువులకు ప్రయత్నించిన మంచి ఫలితముండును సూచించవలెను. .
- ఈ జాతకులు అనైతిక స్వభావము కలిగిన వారైనందున వీరు చేసే ప్రతి పనిలో తగు జాగ్రత్తలు తీసుకుట వలన ఇబ్బందుల నుండి బయపడుటకు అవకాశముండును.

# 4 వ ఇంటి అధిపతి 7 వ ఇంట్లో

- ఈ గ్రహ స్థితిని భావత్భావముగా కుడా పరిగణించవచ్చును. (7 వ ఇల్లు 4 వ ఇంటి నుండి 4 వ ఇల్లు కనుక 1 వ ఇంటి అధిపతి 1 వ ఇంటిలో ఉన్నట్లుగా)
- 4 వ ఇల్లు తల్లికి చెందినది గనుక వీరి తల్లి మంచి చదువు దేహ దారుడ్యము కలిగి వుందురు.
- ఈ జాతకులు జీవితములో అధిక  సమయము  స్వస్థలము నుండి దూరముగా గడిపే అవకాశముండును.
- వీరి వివాహానంతరము జీవిత భాగస్వామి ద్వారా  4 వ ఇంటి సుఖములయిన  ఆస్థి వాహన యోగము లభించును.
- వీరి జీవితభాగస్వామి ప్రేమానుకూలమయిన వారుగా చెప్పవచ్చును.
- గ్రహములు వక్రించినచో వీరికి వాహన ప్రమాదములు కలిగే అవకాశముండును.
- ఈ జాతకుల భాగస్వామ్య వ్యాపారములో వీరి సంపదన లాభాములతో కూడి వుండును. (7 వ ఇల్లు వ్యాపార భాగా స్వామ్యమును సూచించుటవలన). 7 వ ఇల్లు 10 వ ఇంటి నుండి 10 వ ఇల్లు భావత్భావముగా కూడా పరిగణించవచ్చును.

# 4 వ ఇంటి అధిపతి 8 వ ఇంట్లో

- 4 వ ఇంటి అధిపతి 8 వ ఇంటిలో ఉండటమంటే 1 వ ఇంటి అధిపతి 8 వ ఇంటిలో ఉన్నట్లు ఈ అధ్యాయానికి. కనుక ఈ జాతకునికి ప్రమాదములు, ఆకస్మిక ఇబ్బందులు అది మృత్యువు కుడా కావచ్చును తదితర చెడు సంబంధమైన ఫలితములు వచ్చును. అదే ఆ భావములో వున్న గ్రహములు అనుకూలమైనచో వారికి ఈ ఇబ్బందులు యెదురు కావు. ఈ భావము తల్లిని సూచిస్తుంది కనుక వారికి పైన చెప్పిన ఫలితములు ఎదురయ్యే అవకాశముండును.
- ఈ గ్రహస్థితి వలన తండ్రికి మారకము అవకాసముండునని చెప్పవచ్చును.
- ఈ స్థితి వలన ఈ జాతకుని ఆస్థి లేదా వాహన నష్టముండునని చెప్పవచ్చును.
- 8 వ ఇల్లు బ్లాకు మాజిక్ ను సూచిస్తుంది కనుక ఈ జాతకులకు ఈ విధమైన భయము యేర్పడుతుంది.
- 8 వ ఇల్లు కామోద్రేకమునకు (లైంగిక శక్తి) చెందినది కనుక వీరికి లైంగిక విషయములలో ఆశక్త వుండదు.
- అనుకూల ఫలితాల విషయానికి వస్తే 4 వ ఇంటి నుండి 8 వ ఇల్లు అయిదవ ఇల్లు కనుక ఇద్ధి, విద్య, పరిశోధన అంశాలు. కనుక ఈ జాతకులు విద్యలో అభివృద్ధి , పరిశోధనలలో పేరు ప్రఖ్యాతలు పొందుతారు.
- 4, 8 వ ఇళ్ళు మోక్షమును సూచించును కనుక వీరు జీవితములో ఎదురైన ఇబ్బందులవలన ఆద్యాత్మికత వైపు మొగ్గు చూపి ఆవిధమైన సాధన కొరకు మతపరమైన విషయములలో ఎక్కువ ఆసక్తి కనబరచుదురు.

# 4 వ ఇంటి అధిపతి 9 వ ఇంట్లో

- (4) 1 వ ఇంటి అధిపతి 6 లో ఈ స్థితి వలన కేంద్ర, త్రికోణ స్థితి వలన 4 వ ఇంటి అధిపతి మంచి బలమైన గ్రహముగా చెప్పవచ్చును.
- ఈ జాతకులు ఆర్థికముగాను, సుఖములు, సౌలభ్యము, విలాసముల విషయములలో మంచి అదృష్టవంతులై అన్ని రకములుగా ఆనందమును పొందుదురు.
- వీరు విదేశములలో అత్యున్నత విద్యను పొంది ఆర్థికముగా బలపడుదురు.
- ఈ గ్రహస్థితి వీరికి ఆస్థి విషయములలో మంచి అదృష్టము కలిగి పిత్రార్జితమును పొందుదురు.
- ఈ జాతకుని తండ్రి సమాజములో మంచి గౌరవము, ఆదరాభిమానములు కలిగి , మతపరమైన మరియు ఆధ్యాత్మికతకు సంభంధమైన సంపాదన వుంటుంది.
- ఈ జాతకులు మోక్ష మరియు ధర్మ సంబంధిత ఈ భావముల కలయిక వలన తత్సంబంధ కార్య నిర్వహణలో బహు ఆనందము పొందుదురు.
- ఈ కలియక వలన ఈ జాతకులు మానసికంగా గందరగోళము లేదా భయకంపితులై వుంటారు.
- ఈ జాతకుల తల్లిగారికి 6 వ ఇంటి కారకత్వమైన అనారోగ్య సమస్యలు ఎదురుకావచ్చును.
- ఈ గ్రహ స్థితి రాజయోగాముగా కూడా చెప్పవచ్చును.

# 4 వ ఇంటి అధిపతి 10 వ ఇంట్లో

- 1 వ ఇంటి అధిపతి 7 వ ఇంటిలో, 4 మరియు 10 ఇల్లు ఒకదాని నుంచి ఇంకొకటి 7 వ ఇల్లు అవుతుంది. అందుచే ఈ జాతకులకు వృత్తిలో అభివృద్ధి కలిగి వృత్తిలో అధిక సంపాదనా పరులవుతారు.
- 7 వ ఇల్లు మారక స్థానము కూడా అయినందున వీరి జీవితములో హెచ్చు తగ్గులుండును. అలాగే వీరు దేనిని అతి సులభముగా పొందలేరు.
- ఈ గ్రహస్థితిచే ఈ జాతకులు వృత్తి సంబంధమైన విద్యలో రాణిస్తారు.
- ఈ జాతకుల తల్లికి ఆరోగ్య సమస్యలుండటముగాని తల్లితో సత్సంబంధములు లేకపోవుట గాని జరుగును.
- 4 వ ఇల్లు రాజకీయపరమైనది కాన వీరు రాజకీయములో స్థిరబడి నాయకుడు గాని మంత్రి గాని అయ్యే అవకాశములుండును.
- 10 వ ఇల్లు సామాజిక స్థితిని తెలుపును, వీరు సమాజములో మంచి పేరు ప్రఖ్యాతలు గలవారగుదురు.

# 4 వ ఇంటి అధిపతి 11 వ ఇంట్లో

- 1 వ ఇంటి అధిపది 8 వ ఇంటిలో వున్నాడు. (11 వ ఇల్లు 4 వ ఇంటినుండి 8 గనుక) 11 వ ఇల్లు కోరికలు 4 వ ఇల్లు భౌతిక ఆనందము అందువలన ఈ జాతకులు భౌతిక ఆనందమునకు ఎక్కువ మొగ్గు చూపుతారు.
- 4 వ ఇల్లు విద్య ఈ అధిపతి 11 వ ఇంటిలో ఉన్నందున ఈ జాతకులు విద్య కన్నా సంపాదన మీద ఎక్కువ దృష్టి పెడతారు.
- 4 వ ఇల్లు స్నేహితులు , 11 వ ఇల్లు స్నేహితుల సమూహము, వీరికి స్నేహితులు ఎక్కువగా వుందురు.
- 11 వ ఇల్లు ఆరోగ్య సంబంధిత విషయములను నిర్ణయించు స్థానము, 4 వ ఇల్లు 11 నుండి 6 వ ఇల్లు కనుక వీరికి ఆరోగ్య సమస్యలు లేదా మానసిక ఒత్తిడి వుండునని చెప్పవచ్చును.
- 4 వ ఇల్లు వాహనములు స్థిరాస్థులు, కనుక వీరికి ఆదాయము ఈ సంబందితమైనది కావచ్చు.
- ఈ రాసులలో గ్రహములు వక్రించి యున్నచో వీరికి వాహనప్రమాదములు వుండునని చెప్పవచ్చును (4 వ ఇల్లు 11 వ ఇంటి నుండి 8 వ ఇల్లు అయినందువలన).

# 4 వ ఇంటి అధిపతి 12 వ ఇంట్లో

- 4 వ ఇల్లు తల్లి 12 వ ఇల్లు వైద్యశాల, మోక్ష స్థానము. ఈ గ్రహస్థితి 9 – 5 బాంధవ్యమును కలిగి వుండును ( 4 నుండి 12 , 9 వ ఇల్లు 12 నుండి 4 5 వ ఇల్లు) 12 దుస్థానము కూడా, కనుక వీరి తల్లి గారికి ఆరోగ్యసమస్యలు లేదా మృత్యువు అనిచెప్పవచ్చును. గ్రహముల వక్ర స్థితిని బట్టి పిన్న వయసులోనే తల్లిని కోల్పోయే అవకాశముండును.
- గ్రహముల స్థితి ఉత్తమముగా వుంటే చంద్రుని కారకత్వమును కూడా పరిగణించి అదికూడా అనుకూల స్థితి లో వుంటే వీరి తల్లిగారు మంచి అదృష్ఠవంతులని చెప్పవచ్చు.
- 4 వ ఇల్లు విద్య మరియు స్థిరాస్థులు, 12 వ ఇల్లు ఇంటినుండి సుదూర ప్రాంతము. కనుక గ్రహస్థితి అనుకూలముగానున్నచో వీరు విద్య కొరకు విదేశాలకు వెళ్లి అక్కడ స్థిరపడతారు.
- 12 వ ఇల్లు స్య సుఖమును ,4 వ ఇల్లు తల్లిని సూచించును గాన వీరి తల్లి గారు ఎక్కువ సమయము నిద్రలో గడుపుట గాని లేక మితిమీరిన లైంగిక ఆనందమును పొందుదురు.
- 4 వ ఇల్లు మనస్సు, 12 వ ఇల్లు ఒత్తిడి కనుక వీరికి ఆలోచనల ప్రవాహముతో ఎక్కువగా నిద్ర లేని రాత్రులు గడుపుదురు. వీరిగ్రహస్థితి బాగున్నచో వీరి జీవిత గమనము ఆధ్యాత్మిక, మతపర, లేదా తత్వ శాస్త్ర సంబంధము కలిగి వుండును.
- వీరు జీవితములో నష్టములు సంభవించిన అవి వాహన లేదా ఆస్థి పరమైనవి అగును.
- 12 వ ఇల్లు 9 వ ఇల్లు కూడా అయినందున వీరు ఆస్థి విషయములో అదృష్ఠ వంతులు అవుతారు.
- 4 వ , 12 వ ఇంటి అధిపతులు ఇద్దరు 12 వ స్థానములో ఉన్నచో, 12 వ ఇల్లు దుస్థానము , 4 వ ఇల్లు ఆనందమునకు చెందినది గాన వీరి జీవత్తములో సంతోషమునకు

# ఈ సమాచారము సమకూర్చిన వారు



**శ్రీ మహాగణపతి జ్యోతిషాలయము**

**డా. నాగేశ్వర రావు జయంతి**

**జ్యోతిష శిఖామణి**

జ్యోతిష శిరోమణి (కృష్ణమూర్తి పద్ధతి)
ఎం.ఏ జ్యోతిష్యము, పి.హెచ్.డి – జ్యోతిష్యము
ప్లా.నం. 3/3, 2-3-364/7, రోడ్ నెం. 7,
సాయినగర్ కాలని, నాగోల్,
రంగారెడ్డి జిల్లా , హైదరాబాద్ - 500068
మొబైల్ : **9849983322**